





# శతకాలు

భక్తి,జ్ఞాన,నీతి

# గురు శతకము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గురు శతకము.



రచయిత:

బంకుపల్లి రామజోగారావు

శ్రీగాయత్రీ ముద్రాక్షరశాలయందు ముద్రితము,
శ్రీకాకుళం.
1939



వెల 2 అణాలు.

# మ న వి.

పాఠకులారా !

నే నీశతకమును కొలఁదికాలములో [illegible]న రచించితిని. ఇదయే నాప్రథమప్రయత్నము. తప్పు లున్నచోఁ, జదువరులు వానినిఁ దెల్పిన ద్వితీయ ముద్రణమున సవరించుకొనెదను. దీనన భిప్రాయములు వ్రాసిన బ్రహ్మశ్రీ శతావధాని బూరాడ గున్నేశ్వర శాస్త్రిగారికిని, బ్రహ్మశ్రీ గోవిందు వేంకటనరసింహ కవిగారికిని మఱియు నీపొత్తమచ్చొత్తించిన బ్రహ్మశ్రీ భిన్నాడ నరసింహ సిద్ధాంతిగారికిని నా కృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచున్నాను.

| | |
|---|---|
| వాడాడ, 20_4_1939. | ఇట్లు సుజన విధేయుఁడు, బంకుపల్లి రామజోగారావు. |

# గురుశతకము.



కం. శ్రీకరుని, గురుని, విబుధా
నీకమ్మును సంస్తుతించి నేర్చినకొలఁదిన్
దేకువమీఱఁగఁజెప్పెదు,
సాకల్యతఁ గందపద్య శతకమ్ము గురూ !

కం. అవినాశపరబ్రహ్మము
భువినెల్లెడ నిండియుండు బూర్ణమది, సం
భవమును నంతములేనిది
యవిరతమును నిర్మలమ్మునై యొప్పు గురూ !

కం. ఏచైతన్యుని కతమున
నీచానీచాది వస్తునిచయము వెలుఁగున్,
వాచామగోచరుండగు
నాచైతన్యునకు మ్రొక్కులర్పింతు గురూ !

కం. గురువనఁగ మానవునకుం
బరతత్త్వముఁజూప, భక్తి భావమునిలుపన్
ధర నవతరించు; గావున
గురువే సర్వస్వమనుచు గొలిచెదను గురూ !

కం. త్రిగుణాతీతుం డెవ్వఁడు
నిగమమ్ములకందరాని నిస్తులుఁ డెవ్వఁ
డు, గురుఁడు జగతికి, నాతని
మొగిఁ బ్రార్థనసేతు నిరతమున్ మదిని గురూ !

కం. ఋజుమార్గవర్తియై తాఁ
గుజనులపై త్రింతయైనఁ గోరక, మదిలో
భజియించు నెవఁడు దేవుని,
భజియించెద; వానిపాదపద్మముల గురూ !

కం. గురుభక్తి ప్రధానముగాఁ
బురుషులు భూలోకమందు ముక్తిస్థానం
బరయఁగఁగలిగిరి కావున
గురునిన్ బరమాత్మగాఁగ గొలిచెదను గురూ !

కం. ఎవరైనను భగవంతుని
శివతత్త్వముఁ జూడఁగోరి క్షితియందెలమిన్
నివసించిరి ముక్తిస్థా
నవిశేషమునందు గురుని నమ్మగద ! గురూ !

కం. భగవంతునిఁ గనుమార్గము
సుగమముగానుండు గురుని శోధించినచో
జగమున నీవె సమర్థుఁడ
వగుదని మదియందు నిన్ను బ్రార్థింతుగురూ !

కం. గురుఁడవని నిన్ను మ్రొక్కితి
సరభసమున నన్ను నీదు సన్నిధియందే
పరతత్త్వమెఱుఁగఁ జేయుచు
గరుణన్నభ్యాసపరునిఁగాఁ జేయు గురూ !

కం. కష్టములకు నెల్లను భూ
యిష్టము సంసారమందు నిహపరముల సం
తుష్టినొసంగఁగ వచ్చితి
సాష్టాంగపు ప్రణతి నీదు చరణముల గురూ!

కం. ముక్తినిఁ బొందఁగ భువిలో
భక్తులు గురుసేవవలనఁ బడసిరి పరమా
ర్థోక్తి యది నాకొసంగుము
శక్తా ! నిను మ్రొక్కువాఁడ సంతతము గురూ !

కం. మునిజనసంఘములెల్లను
నినుఁగనలేరైరి నిత్యనిర్గుణమూర్తీ !
ఘనమైన నీదురూపముఁ
గననోపుదు నెట్లు ? నిత్యకారుణ్య గురూ !

కం. పుట్టుటయుఁ బెరుగుటయునిటం
గిట్టుటయును భవదఖండ నిర్ణయమున నే
నెట్టన జరుగునటంచును
గట్టిగమదినమ్మువాఁడు ఘనుఁడుగద ! గురూ !

కం. పండితపామరులందునఁ
జండాలురయందు నిరత షట్కర్మలయం
దుండు నొకలీల నట్టి య
ఖండుని మదిఁగొలుతు భక్తికలితముగ గురూ !

కం. ఆకారశూన్యుఁడవనియు
సాకారుఁడవనియు నిత్యసత్యుఁడవనియున్
లోకాతీతుఁడవనియు శు
భాకారుఁడవనియు నిన్ను బ్రార్థింతుగురూ !

కం. గురుఁడే బ్రహ్మ యనందగు
గురుఁడే శ్రీవిష్ణుమూర్తి గుర్తింపంగా
గురుఁడుగఁ యీశ్వరుండును
గురుఁడే బ్రహ్మమని నిన్నుఁగొలిచెదను గురూ!

కం. ఛాత్రులసందేహములను
మైత్రిఁ బాటించి తీర్చి మహిమ వెలయఁగా
క్షేత్రము పరమార్థమునకు
పాత్రముగాఁజేసి జనులఁ బాలించు గురూ!

కం. జగముల నుద్ధారణసే
యఁగ నెంతయు నాత్మనెంచి యవనీస్థలిపై
నిగమాంతవేద్యుఁడవగుచు
సుగతినిజూపించు నిన్ను స్తుతియింతు గురూ!

కం. దీనత్వము, నమ్రత్వము,
దానమ్మొనరించుటయు, నుదారతమనుటన్
ఏనరుని గుణములగునో
యానరునకు వందనముల నర్పింతు గురూ!

కం. కనువిచ్చినంత సూర్యునిఁ
గనఁగలిగినయట్లు లోనఁగన్నది విడినన్
గనవచ్చు నిత్యు నందుకు
ఘనమగు నీయతులదయయ కావలయుగురూ!

కం. తనుదానెఱుఁగుట యనఁగాఁ
దనలోపలనున్న సారతత్త్వముఁ గనుటే
తనుదానెఱిఁగిన యూచి
ద్ఘనునెఱిఁగినయట్లయగునుగద! పరమగురూ !

కం. వంతలుగలిగినఁ దా నిసు
మంతయు గణియింపఁబోక నాత్మంగనుచున్
సంతసము వీడకే గురు
చింతనమొనరింపఁగాదె సేమమగు గురూ !

కం. నామొరల నాలకింపుము
ప్రేమాదులు నాకొసంగి ప్రియతమునెపలన్
సీమంబు నిష్ట కలుగఁగఁ
గామాదులుమాన్పి నిన్నుఁ గనఁజేయు గురూ !

కం. తప్పుల నెన్నోఁజేసితి
నొప్పిదములుగాఁగ వాని నోసరించి క్షమన్
విప్పి వచియించి బోధను
తప్పులులేకుండ నన్ను దరిఁజేర్చు గురూ !

కం. కుహనాగురులను నమ్మక
యిహమునఁ బరమునను నీకు నెంతయుఁబ్రీతిన్
సహవర్తినై మెలంగుచు
విహరించెద నీదు బోధవీధి సతగురూ !

కం. నరునకు మరణముతప్పదు
పరమార్థము సతముగాన భక్తుఁడు దానిన్
గురుచరణసేవఁజేసియె
ధరఁగొను; నద్దానికొరకు ధ్యానింతు గురూ !

కం. కరుణాకరుఁడవు గురుఁడవు
స్థిరుఁడవు వరదుండవీవు సిద్ధికరుఁడవున్
పరముఁడవు ప్రేమరూపివి
వరదుఁడవున్ మునివి భక్తవత్సలుఁడ గురూ !

కం. నినుదలఁచు నంత మాత్రన
ఘనపాపసమూహమెల్ల కడలకుఁదొలఁగున్
వినయాదులు లభియించును
మనవచ్చును భుక్తిముక్తిమార్గముల గురూ !

కం. ధనధాన్యంబులు గలిగిన
ఘనతయు గౌరవముబొందఁగానౌ నగుచోఁ
గనవచ్చునెట్లు ? నిత్యుని
వినుతుని బరమాత్ము వేదవేద్యు సతగురూ !

కం. నీమూర్తిధ్యానమ్మున
నేమోదముగల్గు మనసు నేకాగ్రమగున్
ప్రేమాయత్తంబగు హృ
త్సీమభవన్మృదుపదములు జెలఁగంగగురూ !

కం. నినుగాంచ నాదునేత్రము
లనవరతము గోరుచుండి యారాటపడున్
ఘనరూప ! నిర్వికారా !
ననుగావుము నిన్నుజూపి నయముగను గురూ !

కం. నిను గాంచి నెన్ని కష్టము
లను బొందుచునుంటి నేను రాజితసుగుణా
వన ! నాకునింకఁ గష్టము
లను బొందింపంగఁ దలఁపరాదు సత్గురూ !

కం. నిరతము నీదగునామ
స్మరణంబున నేను కాలమానము గడపన్
స్థిరముగ నీపద భక్త్యా
చరణంబుననుండ వరమొసఁగుము సత్గురూ !

కం. భువినేవిధమునన్నైనను
దవులాటమునందు బడక స్వాత్పదయుగ్మం
బవిరళ నియతి భజించెడి
సువిశేషపరిజ్ఞ నిమ్ము శుద్ధాత్మ ! గురూ !

కం. ప్రాపంచికవైరాగ్యము
నేపట్టునన్నైన విడువ నీయక దయతో
కోపాదులుబ్బనీయక
కాపాడుము నన్ను దీన కల్పతరు ! గురూ !

కం. సేవంజేయుకోలందిని
భావంబున నూత్నరుచులు వఫ్ఫెల్లంగా
దీవింపుమయ్యా ! సద్గురు !
భావించెద నీదుపాదపద్మముల గురూ !

కం. నీపాదములకు మ్రొక్కెద
పాపంబులఁజేయనీయవల దరిషడ్వ
ర్గోపాటోపము మాన్పుము
పాలింపుము నీదు పాదభక్తసిల గురూ !

కం. ఎన్నడు దర్శనమిచ్చెద
వెన్నడు చూపెదవు నాకు నీశ్వరుమూర్తిన్
బన్నములు మాన్పి సతము బ్ర
సన్నుఁడవై యొసఁగుము దరిశనము సతగురూ !

కం. ఎఱుఁగను వేదాదులను నే
నెఱుఁగను యోగములగూడ నేమాత్రమునున్
ఎఱుఁగ భవదీయ సేవల
నెఱుఁగని నే గనుటదెట్లు? యీశ్వరునిగురూ!

కం. మానవుఁడు ముక్తిఁగొనఁగా
దీనత్వమె ముఖ్యమైనది యటంచు గడున్
దీనతనుండిన నన్ను న
న్నీనునిఁగాఁజేసి దానిస్థితిసిమ్ము గురూ !

కం. నాకర్మభారముల నెం
తో, కరుణన్ బాయఁజేసి దుస్సాధ్యంబౌ
శ్రీకరుని ముక్తిమార్గము
బ్రాకటముగఁగూర్చు నిన్ను బ్రణుతింతుగురూ!

కం. నినుమనమున నుతియించుచు
గనుచుంటిని ముక్తిగూర్చి క్రమశిక్షణలన్
వినుచుంటి నీదుబోధను
మనుచుంటిని నీదు సత్యమార్గమున గురూ !

కం. పరమాత్మునిఁ గనుమార్గము
సరిజేసియె ప్రీతితోడఁ జయ్యన నన్నున్
గురుతింపఁజేయుచుంటివి
స్మరియించెద నిన్ను నధికసద్భక్తి గురూ !

కం. ఆసననియమముచేతన్
గాసంక్తి నను మనంబు గదలింపక యు
భ్యాసముచేయించెడి ని
న్నే, సతతముగొల్చుచుందునియమముగ గురూ!

కం. జీవోద్ధారణమునకై
నీవిల జన్మించినావు నిర్మలమగు నీ
భావంబు నెఱిఁగియుంటిని
కావింపుము నీదుకార్యకరణంబు గురూ !

కం. సత్సాంగత్యమువలనన్
సత్సంగము; దానివలన సచ్ఛాస్త్రపిలా
షోత్సుకత, దాన నిశ్చల
వాత్సల్యత, దాన ముక్తిపథము సద్గురూ !

కం. అని నీవుచేయుబోధను
మనమున నభ్యాసరీతి మానక కనుచుం
టిని దివ్యమూర్తి! తావక
ఘనభక్తిని నీదురూపు గాంచవలె; గురూ !

కం. ఆశాపాశము నన్నున్
పేశలముగఁ జుట్టుముట్టి పీడింపఁగ నా
వేశమున నిన్ను గొలిచి, చి
దాశ్వరియించుచుంటి నమలాత్మ! గుహా !

కం. నీవే నాప్రియసఖుఁడవు
నీవే నాపరమపితవు నీవే బతియు
న్నీవే ముక్తికరుండవు
నీవే నాపాలిభాగ్యనిధివైతి గుహా !

కం. మందమతినగుట నాదగు
సందేహములన్ హరించి చక్కని బోధన్
బొందఁగఁజేయుచు నాకు
న్నందించితి ముక్తిపథము నమలాత్మ! గుహా!

కం. ప్రేమయన లోకమందునఁ
గామించుటయయ్యె; తత్త్వగాముల కెలమిన్
బ్రేమయన దైవభక్తికి
ప్రామాణ్యంబనుచు నెఱుఁగఁబడితి సతగుహా!

కం. పరమార్థమార్గమనునది
గురుబోధాచరణదీక్ష గుర్తింపంగా
తెలియఁగఁదగు శబ్దమనఁగాఁ
గరుణాకర ! దానిదెలియఁగఁ గల్గితిని గురూ !

కం. చిత్కళలకెల్ల శబ్దం
బుత్కళిక యటంచు నెఱిఁగియుంటిని; నీసం
పత్కరుణవలనఁ గలుగును
తత్కార్యము కౌతుకప్రధానముగ గురూ !

కం. ఆమనివచ్చిన వృక్ష
స్తోమము వికసించునట్లు శుద్ధాత్మ ! ప్రభూ !
నామది నీవు వసింపఁగఁ
బ్రేమాదులు పెచ్చుపెఱిగి వెలసినవి గురూ !

కం. అహమను మాయాజాలము
తహతహలన్ నన్నుముంచి దర్శనభాగ్యం
బిహమున లేక యొనర్పఁగ
నహమును ఛేదించి కాచి తమలాత్మ ! గురూ!

కం. గురుసేవ దేవసేవగ
గురుతత్త్వము పరమపురుష! కూటస్థముగా
గురుకార్యమజుని పనిగా
ధరలో నొనరించు నీవు ధన్యుఁడవు గురూ!

కం. పరమాత్మను దర్శింపఁగ
నరుఁడసమర్థుండుగాఁడె? నామస్మరణన్
గురుసేవఁజేసి తత్కృప
స్థిరచిత్తతఁగాంచ ముక్తిస్థిగద ! గురూ !

కం. మఱువఁగరాదెప్పుడు స
ద్గురు; సత్యము విడువరాదు దుర్మార్గమునన్
జరియింపరాదు నీపద
సరసిజములు మదినినిల్పు సజ్జనులు గురూ !

కం. జననీజనకుల భక్తుల
ననయము బూజించుటరయ నర్హము భువిలో
వినయము గలిగి మెలంగుట
ఘనతనుసూచించు విగతకల్మషము గురూ !

కం. ఒకరియెడ మిత్రభావము
నొకరియెడ నమిత్రభావమొప్పదు సమతన్
సకలమునందు మెలంగుట
సుకమొనగూర్చు నది నిత్యశోభనము గురూ !

కం. పరకాంతలఁ గూడుటయును
బరుషములాడుటయు బుధులఁబాటింపమియున్
విరసములాడుటయును దన
గురుఁదూరుట పాపకార్యగుణతతులు గురూ !

కం. త్రాగుటయు నిల్లుటమునకు
నేఁగుటయును జూదమాడనియ్యకొనుటయున్
భోగములు నిత్యమనుటయు
రాగాంధుని యుక్తవాదరాజములు గురూ !

కం. కర్మము నెపమున జరుగు న
ధర్మములను విడువవలయు ధారుణిలోనన్
నిర్మలచిత్తముతో నిజ
ధర్మమునడపుటయె జన్మతారకము గురూ !

కం. ఒనరుపవాని నుపకృతి నె
వ్వని కేనియు; జేతనైన వస్తువితతిచేఁ
దనుపవలెఁ గోరువారలఁ
గనవలెఁ బ్రేముడిని విబుధకాండమును గుహా !

కం. శుద్ధమ్మైన యహింసా
సిద్ధాంతము నాచరించి శీలవ్రతసం
బద్ధుఁడయి పరఁగునట్టి సు [గుహా !
బుద్ధియె పూజ్యుండు, ఘనుఁడు, పుణ్యుఁడును

కం. గృహిణినిఁ బలుచన సేయక
గృహలక్ష్మిగ నెంచి తనకు గీర్త్యపకీరుల్
గృహిణియ చేకూర్చెడిదని
గ్రహియించగలాఁడు సుఖముగాంచునిలగుహా!

కం. కలిగిన ధర్మము చేయక
మెలఁగక నిజమార్గమందు మేలొరులకు దా
దలఁపక భగవంతుని లోఁ
గొలువకచరియించువాఁడు కుత్సితుఁడు గుహా!

కం. విహితమొనరించు నాతని
కహితమ్మొనరించువెంతొ యఘమగు భువిలో
విహితాహితముల నెఱుఁగని
సహవాసముచేత నెవఁడు శాంతించు ? గురూ!

కం. భూతములఁ బ్రేమఁజూడమి,
మాతాపితృభక్తినేయ మానుట, విషయ
వ్రాతమునందునఁ జిక్కుట
పాతకనరక సహజమైన భావములు గురూ !

కం. పరధనములఁ గోరుట, యొరుఁ
బరిభవమొనరుచుట, గొప్పపాపము; సత్యం
బరయక శోండరపడుటయు,
స్థిరచిత్తతలేమి కీడుచేకూర్చు గురూ !

కం. పున్నెపుచరితము సతతమా
నెన్నాళ్ళే యన్నినాళ్ళు నిమ్మగు దివమం
చన్న భవదీయవాక్యము
మన్ననఁబాటించువాఁడు మాన్యుఁడగుగురూ !

కం. సుకమునఁ గష్టమున న్బతి
నొకతీరునఁగాంచుఁ బొంగకోడక జలమ్ము
శ్నికరము విప్పినఁ గప్పిన
నకలంకునికరణి సాధ్వి యలఘుగద ! గురూ !

కం. పితరుఁడు దైవసముండగు
నతనికి హితవెద్ది యదియ యాచరణీయం
బితరములు తగవు సుతునకు
మతములలో నిదియు గొప్పమతమ్మానె? గురూ!

కం. అమ్మను మించిన దైవం
బిమ్మహిలో లేదటంచు హృదయమ్మునందున్
నమ్ముచు నుడి జవదాటక
కమ్మఁగఁదిరుఁగాడునతఁడు ఘనుఁడుగద! గురూ!

కం. క్లిష్టపుదాస్యమ్మది దుర
దృష్టమునన పైనిఁబడును ధీమతు లెన్నం
డిష్టపడరేల ? దాని, ని
కృష్టమ్మనుచు మదిఁదలంచి హేయమ్మున గురూ!

కం. అధికారము గలిగియు దా
బుధపూజితుఁడై నవాఁడు పుత్రునిలీల
న్నధముఁడగు సేవకునిఁగను
విధియుంపఁడుగద ! యవాచ్యవిధులందు గురూ!

కం. ధనవంతుఁడనను మదమున
వినయము, ధర్మమును, లేక బీదలయెడఁదా
ననయము నిర్దయ సూపిన
ఘనమగునరకమునఁ గూలఁగాఁబడఁడె? గురూ!

కం. బలముగలవాఁడు బలు దు
ర్బలులను బాధించుటరయఁ బాపము భువిలో
ఖలులను శిక్షింపఁగఁ దన
బలముపయోగించు టధికఫలముగద ! గురూ !

కం. బలహీనుఁడనని భయపడి,
యిలనెప్పుడు చింతనుండు టేరికినై నన్
వలది;ంతకంటె ఘనమౌ
బలమున్నది; యదియె నీతివర్తనముగురూ !

కం. దమమది గుణములలో ను
త్తమమైనది యాచరింపఁదగుఁ బుడమిని దా
ని, మఱచి వర్తించిన, బు
ణ్యము దొలఁగదే? పాతకాశ్రయముగాదే? గురూ!

కం. ధనము భువిలోన శాశ్వత
మని బుద్ధిఁదలంచి ధర్మమనుసంధానిం
చినవాఁడు ముక్తిఁబొందును
ఘనుఁడయి, భవదీయమార్గగామియయిగురూ!

కం. శ్రమపడి, సంపాదించు ధ
నముచేతనె తృప్తుఁడగుచు, నైర్మల్యంబై
న మనముగలిగి మెలంగిన
నమలంబగుకీర్తిఁగాంచు నతఁడుగద! గురూ!

కం. బెడిదములు కూడదెందును
విడువలెనె వ్యసనములను భీష్మించుకదాఁ
గడఁగవలెనే? కార్యమునకు
నడిగిన లేదనుచు నెప్పుడనరాదె? గురూ!

కం. గతజన్మ నోరులకిచ్చిన
కతమున నే కాదె, ధనముఁగలవాఁడగుటన్
గతిమఱచి యొరులకీయక
యతిపాపుఁడు నేటిజన్మమం దతఁడు గురూ !

కం. సకలేశుని ధ్యానించుట
యకలంకుని నిన్నుఁగూర్చి ప్రార్థించుటయు
న్నొకవిధముననున్నట్టులఁ
బ్రకటించి తభేదభక్తిభావమును గురూ !

కం. పరమాత్ముని నిజతత్త్వము
గురుతింపఁగఁజేయు, నీదుగొప్పదయకు ని
ర్ధరఁబాత్రుఁడైనవాఁడే
చిరతరమగు భక్తిమార్గస్థిరుఁగను; గురూ !

కం. గురుదర్శనమును బొందిన
యురుగుణునకు లోపమెద్దియుండఁగల్గదు స
ద్గురుదర్శనమ్మె దేవుని
దరిశనమౌఁగాదె సర్వదత్తుండ ! గురూ !

కం. నీదాసులపదసేవయె
నీదగు పదసేవయనుచు నిరుపమభక్తిన్
వాదములుమాని దాసుల
పాదములనుగొల్చువాఁడె పావనుఁడు గురూ !

కం. చేసినక్రియ భవదర్పణ
చేసినమేలొదవు ముక్తి చేకుఱుగద ! పే
రాసను ద్యజయించిన నే
మోసమునంబడక ముక్తిఁబొందుగద ! గురూ !

కం. నీపరూపము గనుఁగొనఁగా
సారూప్యమ్మొదవు సర్వశక్తులు గలుగున్
ధీరుఁడగు; నరుఁడు దా సం
సారము విడనాడి పరము సాధించు గురూ !

కం. ఇహలోకసుఖవాంఛలు విడి
సుహృదయుఁడై భక్తిఁగలిగి శోభిల్లుచు దా
నహము విడి యెల్లవేళల
సహనముమైనడువఁ బరము సాధించు గురూ

కం. జీవులకుఁ గీడొనర్పక
భావంబున నచలమైన భక్తి మెఱయఁగాఁ
బావనకర్మంబొనర్చెడి
జీవితమది ముక్తిదమ్ము సిద్ధగద ! గురూ !

కం. మానవుని గొప్పశత్రువు
మానసమేయగును సర్వమలినములకు నీ
మానసమె తావుగాఁగని,
దానిని లోఁగొనెడివాఁడె ధన్యుండు గురూ !

కం. ఒనరుచు కర్మము నక్కఁ గలి
గినఫలితము గోరఁబోక కింకరుడై నీ
కనయము నర్పణజేయుచు
మనునట్టిఁడు గొప్పబుద్ధిమంతుఁ డిల గురూ !

కం. మనుజుని యాంతర్యమ్మున
ఘనమైనది యాత్మ మనసు కాదది కాయం
బునుగాదు జడతగలుగుటఁ
గనవలె, నయ్యాత్మగురుని గమనించి గురూ !

౯౦. మృతిఁగూర్చి యెల్లవేళల
స్మృతినుంచెడి మానవుండు జేయఁడఘములన్
సతమనఁడుగిది ! ప్రపంచము
జతనమ్మొనరించు ముక్తి సాధింప గురూ !

౯౧. నీతిగఁదా మెలఁగియు, నవి
నీతులనుం జెగడనేని నిష్ఫలమగు, నా
నీతి; యహమ్మునఁ దవులని
రీతినిఁ, బోవచ్చు; బుధవరేణ్యుండు గురూ !

౯౨. గురువర్య ! నీదుశతకము
స్థిరచిత్తతఁ జదువ నిష్టసిద్ధి లభింపన్
వరమొసఁగుము మానవులకుఁ
బరమార్థమెఱుంగు భక్తిభావమున గురూ !

౯౩. క్షితి బంకిపల్లివంశ
స్థితులౌ శ్రీ బుచ్చిబాబు శ్రీ సూరమకున్
సుతుఁడను శతకము వ్రాసితిఁ
బ్రతిఫలముగ రామజోగరాయుండఁ గురూ !

సద్గురుచరణార్పణమస్తు.